Communion with God (Atman) alone can render perennial happiness to man. One may study almost all the books in the world, master every branch of literature under the sun, extend his sovereignty over lands beyond the seas, possess heaps of wealth, enjoy all the sense-objects possible, but so long his mind rests not in Atman (God) there is no hope of peace for him.

So, let us all be prepared to drink the nectar of unbounded happiness by following the injunctions of our sacred Rishis and let us by sincere efforts reach the goal sooner and enjoy the fruits there in. The Lord is not far off. He is dwelling in the chamber of our hearts ready to receive us with his sweet love. Let us not forget him at any time and by his blessings getting the means to still the bubbling mind, absorb ourselves in meditation and thus ultimately merge in Him the abode of illimitable joy and bliss!

(Swami Vidyaprakashananda.)

భగవచ్చింతన యొకటియే జీవునకు శాశ్వత ఆనందము ప్రసాదించగలదు. ప్రపంచములోని సమస్త గ్రంథములను అధ్యయనము చేసినను, రాజ్యాధిపత్యమును బడసినను, కొండంత ధనమును సంపాదించినను, విషయసుఖములన్నిటిని అనుభవించినను, మనస్సు ఆత్మయందు లయింపనిచో జీవునకు శాంతి కలుగనే కలుగదు.

కాబట్టి శాస్త్రములు, సద్గురువులు ఆదేశించిన ప్రకారము శ్రద్ధతో పరమార్థ సాధనయొనర్చి నిరతిశయ బ్రహ్మానందమనుభవించెదము గాక! భగవానుడు అతిసమీపముననే మన హృదయస్థానముననే మనల ననుగ్రహించు నిమిత్తము వెలయుచున్నాడు. ఆ పరాత్పరుని విస్మరింపక, నిరంతరము స్మరించుచు వారి యనుగ్రహాతిశయముచే మనోజయోపాయములను, బుద్ధియోగమును బడసి ధ్యానమగ్నులమై సచ్చిదానందసాగరమున నోలలాడుదుము గాక!

(స్వామి విద్యాప్రకాశానంద.)

ఓమ్

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య

# శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి

# జీవిత చరిత్ర

(రచయిత: బ్రహ్మచారి గోపాల్)





ప్రకాశకులు:

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

కాళహస్తి

1981

[రూ. 1-25

# దైవప్రార్థన

కరుణామూర్తియగు సర్వేశ్వరా! మా చిత్తము సర్వకాల సర్వావస్థలయందును నీ పాదారవిందములందు లగ్నమై, అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము!

పరమదయానిధీ! ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండువరకును మనోవాక్కాయములచే మావలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము!



సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా! మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్టసంకల్పముగాని, విషయవాసనగాని, అజ్ఞానవృత్తిగాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము!

వేదాంతవేద్యా! అభయస్వరూపా! మాయందు భక్తి, జ్ఞాన వైరాగ్యబీజము లంకురించి శీఘ్రముగ ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుము. మఱియు ఈ జన్మమునందే కడతేరి నీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుము!

దేవా! నీవు భక్తవత్సలుడవు! దీనులపాలిటి కల్పవృక్షమవు! నీవుతప్ప నాకు ఇంకెవరు దిక్కు? నిన్ను ఆశ్రయించితిని. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము. తమస్సునుండి జ్యోతిలోనికి తీసికొనిపొమ్ము. మృత్యువునుండి అమృతత్వమును పొందింపఁజేయుము. ఇదే మా వినతి. అనుగ్రహింపుము. నీదరి జేర్చుకొనుము. పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి!

ఓం తత్ సత్.

(ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమముతప్పక ఉదయము నిద్రలేచునపుడు, రాత్రి పరుండబోవునపుడు మనస్ఫూర్తిగా పఠించుదురో అట్టివారికి జీవితమునం దేలాటి దోషములున్ను కలుగకుండుటయేగాక భగవంతునియొక్క అనుగ్రహమునకున్ను వారు పాత్రులు కాగలరు.)

# SPIRITUAL MESSAGE

## (Swami Vidyaprakashananda)

Strike the iron when it is hot! Begin the spiritual Sadhana right earnestly now. Who knows what comes near at hand! Death is dancing behind everybody ready to devour him in a short time. Disease and decrepitude, all are waiting to show their respective skill on mankind. Still, how preposterous it is to entertain the idea of tomorrow casting off the opportunities of to-day? How marvellous it is to see people cherishing hopes after hopes over things utterly unreal and ignoring the one which is Real! God forbid! Let the light be taken care of, not the darkness!!

దీపమున్నపుడే ఇల్లు చక్కబెట్టుకొనుడు! ఆరోగ్యముగ నున్న ఈ సమయముననే పరమార్థసాధనను ప్రారంభించుడు. రేపేమి జరుగునో ఎవరికెఱుక? మృత్యువు ప్రతిజీవి చెంత పొంచియుండి అచిరకాలములో వానిని మ్రింగివేయుటకు సిద్ధముగ నున్నది. మఱియు వార్ధక్యము, రోగము బాధించుటకు వేచియున్నవి. ఇట్టి స్థితియందు గూడ జనులు భగవంతుడొసంగిన చక్కని అవకాశములను బోగొట్టుకొని, రేపు రేపని కలవరించుచు తమ ఆధ్యాత్మికసాధనను ఉపేక్షించుచున్నారే! సత్యమగు భగవంతుని విస్మరించి అసత్యములగు ప్రాపంచిక పదార్థములను నమ్ముకొనియున్నారే! కావున ఇప్పటికైనను జాగరూకులై అజ్ఞానాంధకార పరిపూరితమగు నామరూపాత్మక విషయజాలమును విడనాడి జ్ఞానప్రకాశమయమగు ఆత్మసామ్రాజ్యము నన్వేషించి తరింతురుగాక!

స్వామి విద్యాప్రకాశానంద.

# శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరి యతీంద్రులకు

## భక్తిపూర్వక సమర్పిత పద్యములు

శ్రీ కల్యాణగుణాలయుం డఖిల సా-క్షీభూతు డాద్యంతశూ
న్యాకారుం డవికారు డక్షరుడు, స-త్యానంద జ్ఞానాత్మకుం
డేకాకారు డగోచరుం డజుడు, స-ర్వేశుండు విద్యాప్రకా
శానంద గిరీంద్ర యోగులనుచున్-సాకారు ప్రార్థించెదన్.

నిత్యానిత్యవివేకతత్త్వ పథ మ-న్వేషాభిలాషన్ జగ
త్సత్యాసత్య నిరూపణం బుపనిష-త్సారంబు గీతామృతం
బత్యానందరస ప్రసాదమిడి మా-యజ్ఞానముం బాపి యా
సత్యార్థం బెరిగించు మానుతుల సా-ష్టాంగంబు గావించెదన్.

చారుతరోపమానముల-సద్రసధారల సాటిలేనివా
గ్ధారల నాకుధారల సు-ధారసధారల గేరులీల యిం
పారగతత్త్వబోధము న-పారముగా వివరించి చెప్పి సం
సార మసారమంచు తుది-సారము దెల్పవె సంయమీశ్వరా!

మాయను సర్వముం నిజము-మాయని దొక్క-యుతాను భక్తిచే
మాయును మాయచేయగల-మాయలవాని భజింపకున్న యా
మాయను మాయజాలరని-మర్మము దెల్పిన యోగిసత్తమా
మాయభివాదమందుకొను-మా యభిమానముతో గురూత్తమా!

విజయనగరం
21-12-1956

ఇట్లు
పెంటపాటి హనుమంతరావు.

# నా మాట

పరిశుద్ధాత్మ స్వరూపులారా !

ప్రపంచములో అన్నిటికి మిన్నయైనవారు గురుదేవులు. లోకములో రెండింటిని పోల్చినపుడు వానిలో మిన్నయైనదానినే గురువందురు. గురువు అనగా గొప్పది, పెద్దది, బలీయమైనది యని యర్థము. అట్లే లఘువు అనగా (తేలిక) చిన్నది, చులకనిది యని అర్థముగదా. కావున లఘుపదమునకు వ్యతిరేకమగు గురువు గొప్పది, మిన్న యను నర్థములో వాడబడుచున్నది. అట్లే ప్రపంచములోని సర్వమునకంటె మిన్నయైనవారు గురువు. అజ్ఞానావరణచే గ్రుడ్డివాడై, దిక్కు మొక్కు గానక సంసారమునబడి కొట్టుమిట్టాడుచున్న జీవునికి జ్ఞానచక్షువునిచ్చి ఆనందధామమున జేర్చు గురుమూర్తి గురువుగాక మరేమగును? అట్టి గురువుకు సమమేది గలదు? అంతయు ఆ గురుదేవునికి తీసికట్టే. ఆహా! ఎంత అన్వర్థనామధేయమది. కావుననే గురుగీత "నగురోరధికం నగురోరధికం హరిశాసనతో హరిశాసనతః" అని భేరి ప్రయోగించినది. గురుదేవులు ఇట్లు సర్వమునకు మిన్నయైనవారు కావుననే సృష్టి స్థితి లయకారులగు బ్రహ్మ, విష్ణు, శివులు ఆ గురుమూర్తియందే అంతర్భూతులు. ఈ విషయమునే "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః" అన్నవి శాస్త్రములు. అంతేగాదు అంతటితో ఆగక ఈ త్రిమూర్తులకు అతీతమైన ఏకసత్తాస్వరూప పరబ్రహ్మము గురుమూర్తియే ("గురుస్సాక్షాత్పరబ్రహ్మ") యని గురుదేవుని పూర్ణస్వరూపమును నిర్వచించినవి. అట్టి పరిపూర్ణ సద్వస్తువగు, చిత్స్వరూపుడగు గురుమూర్తిని నిత్యము స్మరించుట, వారికి అంజలి ఘటించుట మన ధర్మము. మనకు తారకమున్న

ఇట్టి జ్ఞానతేజోమూర్తులైన ఆశ్రితతారకులైన గురుదేవులలో శాంకరగు సద్గురుమూర్తి పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ విద్యా

ప్రకాశానందగిరిస్వాములవారి చరిత్రనుగూర్చి మాటిమాటికి చాలమంది అడుగుచుండుటచేత అద్దానిని గ్రంథరూపమున ప్రకటించవలెనను సంకల్పము చాలాకాలముగా గలదు. శ్రీవారికి 1964 ఏప్రిల్ 13 వ తేదీతో ఏబది సంవత్సరములు పూర్తియగుటచే తత్స్మృతిగా శ్రీవారి చరిత్ర ప్రకటించ భక్తులందరికి సంకల్పము గల్గినది. దాని కార్యరూపమే ఈ గ్రంథము. అయితే సర్వోన్నత గురుదేవుని చరిత్ర యెచట? నా వంటి వాడు దానిని రచించ బూనుటెచట? మహాకవి కాళిదాసన్నట్లు బుడుతడు ఉన్నత వృక్షఫలమునకు చెయ్యి ఎత్తి ఎగిరినట్లు హాస్యాస్పదమే. అయితే పూర్వం కోతులు రామనామజపం చేస్తూ సముద్రంలో రాళ్ళువేస్తే, ఆ రాళ్లు తమ రామనామ ప్రభావంచే మునిగిపోయే స్వభావాన్ని వదలి తేలి యాడుతూ రామునికి వారధి అయినవట. అట్లే సర్వోన్నత గురుమూర్తి చరిత్రను ఈ రచనా వ్యాజంతోనైనా స్మరించే అవకాశంగల్గి తద్వారా మా హృదయస్థ అంధకారం (అజ్ఞానావరణ) నశిస్తుందని ఆశిస్తూ ఈ పనికి బూనితిని.

ఈ రచన అతిస్వల్పకాలంలో చేయవలని వచ్చుటచే చాల సంగ్రహరూపంలో "కట్టె, కొట్టె, తెచ్చె" అన్నట్లున్నది. చరిత్రతో పాటు ఇందు అమూల్యములగు శ్రీవారి సదుపదేశరత్నములను చేర్చి, దీనికి అమూల్యతను గూర్చితిమి.

శ్రీవారి అర్ధశతాబ్ది జయంతి సందర్భంగా ఉడుతాభక్తిగా సమర్పించుకొన్న ఇద్దానిని శ్రీ స్వాములవారు స్వీకరించి అనుగ్రహింతురు గాక!

శివమస్తు

బ్రహ్మచారి గోపాల్.

# శ్రీ సద్గురు
# విద్యాప్రకాశానందగిరిస్వాములవారి
# జీవిత సంగ్రహము

రత్నగర్భయని పేరుగన్నది భారతదేశము. జ్ఞాన తేజోవిలసితులగు 'ఆధ్యాత్మికరత్నము'లను కన్నకడుపు గాన భారతమాతకా పేరెంతేని తగియున్నది. అవ్యయమై, అనంతమై, సచ్చిదానంద స్వరూపమైనట్టి బ్రహ్మముయొక్క అనుభూతిని, దైవానుభూతిని పొంది ఆధ్యాత్మిక రాజ్యమున నిరంకుశముగ ప్రవర్తించిన మృత్యుంజయుల కిది పుట్టినిల్లు. కనుకనే మాక్సుముల్లరు వంటివారు భారతదేశమున జన్మించుటే మహాభాగ్యమని యెంచి దానికై తపించిరి. "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్ ఆవృత్తచక్షుః అమృతత్వమిచ్ఛన్" అన్న శ్రుతిరీతి అమరులగు ధీరులు, మహాత్ములుండుటచేతనే నేటికిని ఈ భారతదేశము సర్వప్రపంచమునకు మాన్యమై యొప్పుచున్నది. సూది విద్యుదీకరణముచే అయస్కాంతమగుటయే గాక ఆపై తన పరిసరములందలి ఇనుపముక్కల నన్నిటిని లాగుకొనునట్లు సచ్చిదానంద దైవధ్యానముచే దైవరూపులైన మహాత్ములు "స్వయంతీర్ణః పరాంస్తారయతి" అన్నట్లు ఆశ్రితజనులను గూడ తరింపజేయుచున్నారు. ఇట్టి కోవకు జెందినవారు శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు.

శ్రీస్వాములవారు భారతమునకు ధాన్యాగారమనం బరగు ఆంధ్రదేశమున పవిత్ర కృష్ణవేణీ నదీమతల్లిచే పునీత

మైన ప్రదేశమగు కృష్ణాజిల్లా మచిలీపట్టణమునందు పవిత్ర వైదికజీవులును, ఆదర్శగృహస్థులును, ఆర్షధర్మమార్తులును, వైజ్ఞానికులు నగు శ్రీ తూనుగుంట్ల రామస్వామి, సుశీలా దేవీ పుణ్యదంపతులకు, లోకమునకు దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి చేకూర్చుటకు ఆనందనామసంవత్సర చైత్ర బ. 3 సోమవారము సరియగు 1914 సం॥ ఏప్రిల్ 13 వ తేది అనూరాధా నక్షత్రం ప్రథమపాదమున ఉదయం 8 గం॥ లకు జననమందిరి. ఆ దినము కాకతాళీయముగా సౌరసంవత్సరాది (అరవసంవత్సరాది) యగుటచే జనులు ఆనందముగ వేడుకలు చేసికొనిరి.

వీరి జననీజనకులు చాల దైవభక్తిపరులు. తండ్రి గారు గొప్ప ప్రజ్ఞాశాలి. వారు B.A. B.L. చదివి ప్రఖ్యాత న్యాయవాదిగా నుండిరి. కాని వారు గొప్ప వైదిక ధర్మ జీవులు. వారు వేదవిజ్ఞానమునందు సునిశితపండితులు. అంతే గాక లోకమున వేదప్రతిపాదిత ధర్మజీవితమును, గార్హస్థ్య జీవితమును ఆదర్శముగా గడిపి తద్ద్వారా పరమ పురుషార్థము నొందుటే లక్ష్యముగా గల్గినవారు. కావుననే తమ సత్యజీవితమునకు, ఆధ్యాత్మిక ప్రవృత్తికి లాయరు వృత్తి అడ్డురాగా దానిని అవలీలగా త్యజించి దేశస్వాతంత్ర్య మునకు పాటుపడిరి. అంతేగాక వీరు వేద ప్రతిపాదిత ధర్మ మున కనుకూలముగా సంఘమును సంస్కరించుటలో చాల గణనీయమైన కృషి చేసిరి. వీరు తమ ఇంటిని ఒక పవిత్ర ఆశ్రమముగా, తపోవనముగా నుంచుకొనిరి. వీరు ప్రస్థాన

త్రయమును భాష్యసహితముగా అధ్యయనము చేసిరి. వీరికి వైదిక క్రియలు కరతలామలకములు. ఇట్టి పవిత్రజీవులకు పుత్రులుగా పుట్టిన మన స్వాములవారు పుట్టుకలోనే పవిత్రులగుట సహజమేకదా!

ఆనాటి భారతపుత్రులలో ఫ్రెంచి భాషావేత్త, కాంగ్రెసు ప్రముఖుడునగు ఆనందమోహన్ బోసుగారొకరు. ఆనందనామసంవత్సరమున పుట్టుటచేతను, ఆనందమోహన్ బోసుగారిపై నుండు గౌరవము చేతను వీరికి తల్లిదండ్రులు "ఆనందమోహన్" అని పేరు పెట్టిరి. పూవు పుట్టగనే తన పరిమళమును వెదజల్లునట్లు వీరు బాల్యమునుండియు చక్కని కుశాగ్రబుద్ధిగలవారై, ఆధ్యాత్మిక ప్రియులై యుండిరి. వీరు చిన్ననాటినుండి విజయవాడయందలి ఓంకారనిలయమను తమ గృహరూప ఆధ్యాత్మిక పాఠశాలయందు గణనీయమైన చక్కటి ఆధ్యాత్మిక వాతావరణములో పెరిగి పరాపర విద్యలందు తమ ప్రతిభను సమముగ ప్రదర్శించుచు వచ్చిరి.

## బాల్యము, విద్యాభ్యాసము

తండ్రిగారు తెనాలియందు న్యాయవాది వృత్తియందుండుటచే అటనే వీరు తమ నాల్గవసంవత్సరమున విద్యాభ్యాసమును ప్రారంభించిరి. అటుపై తండ్రిగారు బాపట్ల కోర్టుకు మారుటచే వీరు ప్రాథమిక విద్యను బాపట్లలో చదివిరి. జీవునిలోని సంస్కారము లూరకుండవుగదా. పూవు పుట్టగనే తావి అబ్బును. అట్లే మన స్వాములవారి బాల్య

క్రీడలు ఆధ్యాత్మిక మయములు, తమతోటి చిన్నపిల్లలతో చేరి పళ్ళెములు కొందరు కొట్టుచుండ దైవవిగ్రహమును ఊరేగించుచున్నామని ఒక బొమ్మను బాపట్ల వీథులలో ఊరేగించుట వీరికి సహజదినచర్యగా నుండెడిది. ఇట్లొక వత్సరం గడువగా తండ్రిగారికి జీవితమందు ఆధ్యాత్మిక ప్రీతి యధికముకాగా వారు తమ లాయరువృత్తి దానికి ప్రతిబంధకముగా నుండునని తలంచి గొప్ప ఖ్యాతిలోనున్న ఆ లాయరు పదవికి ఉద్వాసన చెప్పి ఆధ్యాత్మికజీవనమునకు, దేశసేవకు విజయవాడ వచ్చి చేరి అట ఓంకారనిలయమును ఒక గృహమును నిర్మించుకొని అందు ఇంటివారందరికి చిన్న పెద్ద భేదము లేక ఆధ్యాత్మికసాధనలందు శిక్షణ నిచ్చుచుండిరి. అందు మన స్వాములవారిది ప్రథమతరగతి. ఈసమయమున మన చరిత్రనాయకులు ఆనందమోహన్ స్థానిక హిందూ హైస్కూలునందు ఉన్నతవిద్యకై ప్రవేశించిరి. తండ్రిగారి ప్రోత్సాహముతో వీరు నిత్యము నిద్రలేచిన జే ప్రార్థన సమాప్తిగ చేసి 4 గం॥ కు కృష్ణానదిలో స్నానంచేసి ఆ పైన గీతాపారాయణ చేయువారు. ప్రతిఆదివారము ఇంటిలో తండ్రిగారు చెప్పు పంచదశి, జీవన్ముక్తి ప్రకాశికాది గ్రంథముల పాఠమందు పాల్గొనువారు. ఇట్లు ఈ ఆనంద మోహనులు చిన్ననాటనే ఆధ్యాత్మిక సాహితీ ప్రవేశమును పొందిరి. వీరు పిన్నవయస్సుననే తండ్రిగారిచే నేర్పబడిన భర్తృహరి సుభాషితములు, శ్రీ శంకరుల ప్రశ్నోత్తరి, ఆత్మబోధ, ఉత్తరరామచరితము, గాయత్రీరామాయణము

మొదలగునవి చెప్పుచుండ జనులు ఆనందములో తన్మయులగువారు; గొప్ప సమావేశములందు వీరు మహాసంకల్పము, చూర్ణిక, ఆశీర్వాదములు మొదలగు వేదమంత్రములను సస్వరముగా చెప్పి వాని అర్థమును విశదీకరించుచుండ సభ్యులు విని ఆశ్చర్యముతో హర్ష ధ్వానములు చేసి మఱల మఱల చెప్పుమనెడివారు.



ఇక ఉన్నత పాఠశాలయందు ప్రతి తరగతిలోను ప్రతి విషయమునందును ప్రథమ బహుమతి వీరిదే. వీరి గృహములో తండ్రిగారేర్పరచిన నియమానుసారము ప్రతి రోజు 500 గజములు నూలు వడికి వారివారి (ఖద్దరు) వస్త్రములకు తగు నూలును వారే సమకూర్చుకొనెడివారు. అటుపిదప ఖద్దరు గుడ్డలు, గాంధీటోపి ధరించి తన సహోదర సహోదరీలతో కలసి జెండా చేతబట్టి విదేశవస్త్ర బహిష్కరణాదులందు పికెటింగ్ చేయుచు (చిన్నమూర్తి) ఖాదీనిగూర్చి ఉపన్యసించుచుండ బజారులోని శ్రోతృప్రజలు భళీ! యని మెచ్చెడివారు. ఇట్లు వీరు ఆ చిన్న వయస్సున ఆధ్యాత్మిక సాహిత్యము నొకప్రక్క, వేదమంత్రములను ఉపనిషత్తులను ఒకప్రక్క, తన పాఠశాల గ్రంథముల నొక ప్రక్క చదువుచు అందు ప్రథమమున నెగ్గుచు మరియొక వైపు దేశసేవయందును తమ కర్తవ్యమును ఆనందముగ నెరవేర్చుచుండుట చూచి అందరును ఇతడు సామాన్యుడు గాడని అపుడే చెప్పెడివారు. వీరికి పరోపకారము, దయ, కరుణ ఉగ్గుపాలతో అబ్బినవి. చిన్ననాటినుండియు ఒక

చీమయైనను పీటబడియున్నచో చూచి సహించలేరు. వెంటనే అన్నిపనులు వదలి దానిని బయట పడవేయుచుండిరి. వీరి గృహమున దీపావళికి 108 జ్యోతులతో ఓంకారమును నిర్మించి దానికి ప్రణవాష్టోత్తరశతనామములతో అర్చన చేయుదురు. వీరి కదియే ఆనందము. కాన వారి తండ్రిగారి "టపాసులు వగైరాలు (బాణాసంచా) కాల్చరాద"ను నియమమును ఎప్పుడూ మనంబున కూడ ఉల్లంఘించి ఎరుగరు. ఆ దీపావళికి వీరి గృహ మొక వైకుంఠముగనే యుండును. వీరి గృహమునందు ఆదివారము నాడు అపక్వాహారము అనగా పండ్లు, పచ్చికూరలు వగైరాలే తినవలెను అను నియమము గలదు. దానిని అతి ఇష్టముతో వీరు అమలుపరచుచుండెడివారు.

మానవునకు ద్విజత్వమును కల్గించు సంస్కారమే ఉపనయనము. ఇయ్యది వేదాధ్యయనమునకు యోగ్యతను కల్గించును. ఈ వేదములు సర్వశాస్త్రములకు, ధర్మములకు మూలములు. ఈ వేదములనుండియే మానవున కిహపర శాంతిసుఖములనిచ్చు సర్వసాధనలు బయలువెడలుచున్నవి. మానవుని మాధవునిగా జేయు విద్య ఇందే గలదు. మానవోన్నతికి వలయు సాధనప్రక్రియలలో ఉపనయనము ఒక మొదటిమెట్టు "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః" అన్నట్లు ఈ ఉపనయనకర్మచేతనే మానవునకు ద్విజత్వము గలుగుచున్నది. అనగా ఈ ఉపనయనముచే గాయత్రీమంత్రోపదేశము నొంది తజ్జపముచే వికత

పాపుడై, అగ్న్యుపాసనచే దివ్య తేజోపలబ్ధిని బడసి బ్రహ్మ చర్యనియమములచే జితేంద్రియుడై మనుజుడు శుద్ధ సత్త్వత నొందును. అపుడు ప్రాకృతజీవనము పోయి దివ్య జీవన మబ్బును. అట్టి ఉపనయనము శ్రీ స్వాములవారికి 10 సం॥ వయస్సులో చతురాహ్నికముగ వేదశాస్త్రవిధి ననుసరించి నిరాడంబరముగ జరిగినది. నాడు శాస్త్రోక్త మగు బ్రహ్మచారిరూపమును ధరించి ముచ్చటగా ఆనంద మోహనుడై యొప్పుచుండెను ఆనందుడు. ఆహా! ఏమి ఆ తల్లిదండ్రుల శిక్షణ! ఏమి ఈ వటుని ఆదర్శప్రియత, వైదికనిష్ఠ. కావుననే నేడు ఆచార్యత్వము సిద్ధించినది. ఈ బ్రహ్మచారిగారు ఒకనాడు దండకమండలములతో కుశ హస్తులై పలాశఅజినధారులై వేదప్రతిపాదిత బ్రహ్మచర్య ధర్మములనుగూర్చి వేటపాలెం సారస్వతనికేతన సభయందు ఉపన్యసించుచుండ నాటి అగ్రాసనాధిపతియగు శ్రీ కాశీ కృష్ణమాచార్యులవారు (నేడు ఆంధ్ర ఆస్థానకవి) ఈ బాలుడు సామాన్యుడుగాడు, గొప్ప మహాత్ముడు కానున్నా డని తమ భావావేశమును ఆ సభలో ప్రకటించియున్నారు. వీరు (ఆనందమోహనులు) ఇట్లు పరాపరవిద్యలందు సర్వాగ్రగణ్యులై ముందుకురుకుచు అభివృద్ధినొందుచు తమ 13వ ఏట S. S. L. C. పరీక్షయందు (ఉత్తమ తరగతియందు) ఉత్తీర్ణులైరి. ఆపైన మచిలీపట్టణమందలి నోబుల్ కాలేజిలో చేరి ఉత్తమతరగతిలో B. A. పట్టభద్రులైరి. ఇచట కాలేజీలో చదువునపుడు ఆఖరు సంవత్సరమున తమ 17 వ ఏట వీరు

అపక్వాహారమును ప్రారంభించి ఆధ్యాత్మిక సాధనల నుపక్ర మించిరి. సమీపస్థ అన్నపూర్ణస్వామివారి మఠమునకు వెళ్ళి రోజూ సాయంస్నానముచేసి జపధ్యానములు చేయుట వీరికి పరిపాటియైనది. ఈ ధ్యానములో మునిగి అపుడపుడు ఒక్కొక్కరోజు రాత్రి తిరిగి ఇంటికి (రూముకు) రాకపోవు టయు, బంధువులు దిగులుతో వెదకుచు వచ్చుటయు జరుగు చుండెను. ఇట్లు వీరు తమ కళాశాల విద్యాభ్యాసమును సాగించి పూర్తి చేసిరి. వీరు భగవద్గీత నిదివరలోనే చదివి యుండుటచే నట బైబిలును ఇష్టగ్రంథముగా తీసికొని పూర్ణముగా చదివిరి. ఈ కళాశాల జీవితములోనే వీరు ఆంధ్ర దేశ భగవద్గీత పోటీలందు ద్వితీయ బహుమతిని, నోబుల్ కాలేజీవారి "భగవద్గీత, బైబిల్" వ్యాసరచన యందు ప్రథమ బహుమతిని, ఏలూరు కాంగ్రెసు జ్యూబిలీ పోటీలలో నూలు వడకుటయందు ప్రథమ బహుమతిని, విజయవాడలో కాంగ్రెసు స్వర్ణోత్సవమందు చరఖా, తకలీ పోటీ (నూలువడకుట) లందు, ఉపన్యాస పోటీలయందు ప్రథమ బహుమతులను (సువర్ణ పతకములను) పొంది యున్నారు. మరియు నాటి కృషివలననే క్రైస్తవుల సెంట్ జాన్, గీత, కొన్ని ఉపనిషత్తులు నేడున్నూ వీరికి కంఠ పాఠములై యున్నవి. ఇట్లు వీరు తమ బాల్యజీవితమును, విద్యాభ్యాసమును చాల ఉన్నతపద్ధతిలో ఆదర్శవంతముగ గడపిరి.

## గురుసన్నివేశము - సమర్పణము

ఇట్లు విద్యాభ్యాసము చేయుచున్న సమయమున ఆంధ్ర దేశమునకు ఆధ్యాత్మిక భిక్షా దాతలును, జ్ఞాన భాస్కరులును, తపోమూర్తియునగు శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు తమ ఆధ్యాత్మిక ప్రచార సందర్భమున శ్రీ ఆనంద మోహనుగారి గృహమునకు వారి తండ్రిగారి ఆహ్వానము ననుసరించివచ్చిరి. సాధుమహాత్ముల సత్కారానంతరము సాయంకాలమున శ్రీవారి ప్రసంగము ఏర్పాటు చేయబడెను. అపుడు శ్రీ మలయాళస్వాములవారు ఆ గృహమును చూచి "నివృత్తరాగస్య గృహం తపోవనమ్" అను సూక్తిరీతి నిజముగా "ఇది తపోవనముగనే యున్నదని" నుడివి, వారికుటుంబ ధార్మిక, ఆదర్శ, ఆధ్యాత్మిక జీవితమున కచ్చెరువందిరి. ఆ సందర్భమున శ్రీరామస్వామిగారికి, తమ పిల్లలలో ఒకరిని ఆధ్యాత్మిక క్షేత్రమున నివృత్తిపరునిగా జేయవలెనను సత్సంకల్ప మొదవెను. అంతట నాడు దేశమున గణనీయ మహాత్ములలో శ్రీ మలయాళస్వాముల వారగ్రగణ్యులుగా నుండుటచే వారికే తమపుత్రులలో నొకరిని నివృత్తిధర్మావలంబనకై సమర్పించ నిశ్చయించి అందుకు తగినవారు (పంచపాండవులవలె) తన పుత్రులైన ఐదుగురిలో ఎవరాయని పరికించ అందుకు తగు సంస్కారము గల్గి అందరికన్న మిన్నయై (పాండవ మధ్యమునివలె) శోభించు తమ మూడవ పుత్రరత్నమగు ఈ ఆనంద మోహనులే తగుదురని తలంచి వారికి తమ కోర్కె నెఱి

గించిరి. వెంటనే మన చరిత్ర నాయకులందుకు కడు మోదముతో తమ ఆమోదమును తెలుప తత్క్షణమే ఆ బహిరంగ సమావేశమున శ్రీ రామస్వామిగారు తమ తృతీయ పుత్రుడగు శ్రీ ఆనందమోహనుని భావికాలమున లోకమును ఆనందముతో మోహింప జేయుటకై శ్రీ మహర్షి మలయాళ స్వాములవారికడ (నివృత్తి ధర్మశిక్షణ నిమిత్తమై) సంపూర్ణముగా సమర్పించివైచిరి. ఆహా! ఆ పుణ్యసందర్భ మెంత కనులకింపుగా నుండెనోగదా! ఆ సందర్భమున జగద్గురువులగు శ్రీ మలయాళ సద్గురువుల మనంబు "సచ్ఛిష్యుడు చిక్కెగదా!" యని ఆనంద డోలికల నూగులాడ, కన్నులందు ఆనందాశ్రువులు జలజల రాలుచుండ తమ హార్దాతిశయము నా సభాసమ్ముఖమున ప్రకటించియున్నారు. నిజముగ ఆ సన్నివేశము, ఆ సమర్పణఘట్టము భారత చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపదగినది.

## సద్గురువు - మంత్రోపదేశము

ఈ సందర్భమున శ్రీ సద్గురు మలయాళస్వాముల వారిని గూర్చి కొంత తెలిసికొందము. శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు నిజముగ సద్గురువులే. ఆంధ్రుల సమష్టి పుణ్య ప్రాభవముచే ఆంధ్రుల నుద్ధరింప దివినుండి భువి కేతెంచిన వ్యాసమహర్షి యే వీరు. ఆ ధీరగంభీర మూర్తిమత్త్వము, తపోగ్నిచే నిర్ధూతకల్మషమైన పవిత్ర శరీరము, జ్ఞాన తేజో విలసితతత్త్వము చూపరుల నట్లే భక్తిభావముతో తలవంపింపజేయును. వీరిని గూర్చి మన స్వాములవారు పలికిన

మాటలనే మనము పేర్కొందము— "గురువులు దొరకవచ్చునుగాని సద్గురువులు దొరకుట చాల దుర్లభము. శిష్యులను సద్వస్తువగు ఆత్మయొద్దకు చేర్చువాడే సద్గురువు. సచ్ఛీలమును వాక్కునందే గాక అనుష్ఠానమునందును దిగ్దర్శన మొనర్చువాడే సద్గురువు. భగవానుడెన్నుకొనిన ఏ కొలదిమంది మహనీయులో అట్టి సద్గురుపీఠ మలంకరించి లోకములో విరాజిల్లుచుందురు. అట్టివారిలో నొకరు శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారు. ఆధ్యాత్మిక విషయములందు పండిన యనుభవముగల మహనీయుడగుటవలనను, పారమార్థిక సూత్రములన్నియు వారికి కాచి వడపోసినవే అయియుండుటవలనను, భక్తులకు వారి సాన్నిధ్యమందు నిగూఢ దైవతత్త్వావగాహనము సులభతర మనిపించుచుండెడిది." ఇత్యాది వారి గురుదేవులంగూర్చిన శ్రీవారి సరియైన చిత్రణ. ఇట్టి పావనమూర్తియైన సద్గురు శ్రీ మహర్షి మలయాళస్వాములవారు తనకు తగిన పవిత్రశిష్యుడు చిక్కినంతనే పుత్రోత్సవము నందిన తల్లివలె అమితానందభాజనులైరి. ఆ సమర్పణ ఘట్టమును ఆ గృహములోని తపోజీవనమును, తన నూతనశిష్యుని బుద్ధికుశలతను, ప్రజ్ఞాపాటవమును, అంతకుమించిన ఆధ్యాత్మిక జీవనమును, తలంచి తలంచి వారు ఆనందములో నుప్పొంగి పోయెడివారు.

తదుపరి ఆనందమోహనులవారికి శ్రీ సద్గురువులవారు 1932 సంవత్సరమున శుభముహూర్తమందు పంచా

క్షరీ మంత్రోపదేశము నొసరించిరి. ఇతః పూర్వమే సంస్కృత విజ్ఞానము గల్గి ఉపనయన సంస్కారము నొంది గాయత్రీ జపముచే నిర్ధూతకల్మషుడై వేదమందలి కొన్ని మంత్రములు, కొన్ని ఉపనిషత్తులు సస్వరముగా అధ్యయనము చేసియుండుటచే శ్రోత్రియుడై ద్విగుణీకృత తేజము నొందిన వీరు ఇపుడు గురూపదిష్ట పంచాక్షరీమంత్రముచే పరిపూర్ణ శుద్ధాంతఃకరణులై భాస్కరునివలె బ్రహ్మతేజముతో వెల్గొంద దొడంగిరి. 1930 సంవత్సరమునుండి అపక్వాహారముతో జీవించుచు ఆధ్యాత్మిక సాధనలు చేసియుండుటచేత మలరహితులైరి. ఇపుడు గురూపదేశమంత్రమందు లక్ష్యముంచి జపధ్యానాదులు తీవ్రముగ జేయ దొడంగిరి. ఇట్లు శ్రీవారు పిన్నవయస్సుననే సద్గురులాభమునొంది ఆధ్యాత్మిక సాధనలు చేసికొనుచు లౌకిక విద్యలందు కళాశాలలో మిన్నయై యొప్పుచు ఆంధ్ర విశ్వవిద్యాలయమున 1933 సంవత్సరమున B. A. పట్టభద్రులైరి. తదనంతరము ఇపుడున్న సంస్కృత ఆంగ్లవిద్యలే గాక భావిభారత రాజభాషయైన హిందీయందును పాండిత్యము సంపాదించ నుద్యుక్తులై దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి రాష్ట్రభాష, విశారదాది పరీక్షలందు త్తీర్ణులైరి. ఆ సమయమునందు తమ గృహమునందు గృహసభ్యులందరిని జేర్చి వారమున కొకమారు ఆధ్యాత్మిక సమావేశములను వీరు జరుపుచుండువారు. అందు కొన్నింటికి వీరి తండ్రిగారు, కొన్నింటికి తల్లిగారు, కొన్నింటికి వీరు

అధ్యక్షత వహించియున్నట్లు ఆ సమావేశముల రికార్డు గ్రంథమును చూచిన తెలియుచున్నది. నేటి ఆధ్యాత్మిక మహాసభల కధ్యక్షతవహించి ప్రకాశించుచున్న వీరు (విద్యాప్రకాశానంద) నాడున్ను సభాధ్యక్షత వహించుట సహజమేయగును. ఏలయన, చక్కెరకు మాధుర్యగుణము సదా యుండుట సహజమేకదా! అట్టి సమావేశమునందలి వారి ప్రవచనములు ఆనాడే ఎంతయో ఉత్తేజకరములుగ నుండెడివి. మచ్చునకొకటి ఉదాహరించెద. అది 21-5-1933 సంవత్సరము. శ్రీముఖనామ సంవత్సర వైశాఖ బ॥ 13 ఆదివారం సాయంకాలం 3 గంటల సమయము. నాటి సభాధ్యక్షులు - తూనుగుంట్ల సుశీలాదేవి - అందు ఆనంద మోహన్ మాడవ ఉపన్యాసకుడు. విషయము-"విశ్వము"

"విశ్వము అనునప్పుడు సాధారణముగా పలువురు మనము నివసించు భూమియే యని పొరపడుదురు. కాని పరమేశ్వరుని లీలావిశేషముచే సృజింపబడిన ప్రపంచ మంతయు విశ్వమునం దిమిడియున్నది. మనము నివసించు భూమి నిమిషమునకు 18½ మైళ్ళ చొప్పున సూర్యునిచుట్టు పరుగిడుచున్నది. సూర్యబింబము భూమికంటె ఎన్నియో రెట్లు పెద్దదై అగ్నిగోళముగా నున్నది. సూర్యుని ప్రచండ అగ్నిజ్వాలలు అనేకవేల మైళ్ళవరకు వ్యాపించుచున్నవి. మనకు రాత్రులందు ఆకాశమున కనబడు నక్షత్రము లన్నియు మన కిపుడు కనబడుచున్నట్లు చిన్నవిగావు. అందు కొన్ని సూర్యునికంటె కొన్నివేల రెట్లు పెద్దవిగా నున్నవి.

అనంతాకాశమున లెక్కకురాని గోళములు దేదీప్యమాన ముగ వెలుగుచు తమ నిర్ణీతస్థానములందు భ్రమణము గావించుచు పరమేశ్వరాజ్ఞానుబద్ధములై సంచరించుచున్నవి. దీనినిబట్టి మనయొక్క అల్పత్వము స్పష్టపడుచుండుటలేదా? ఒక్క రేయి నిర్మలాకాశమును ప్రశాంత చిత్తముతో వీక్షించినయెడల భగవానుని దివ్యవిభూతి దృగ్గోచరమగుచు జగన్నియంతయొక్క విశ్వరూపసందర్శనము గాకుండునా? ఇట్టి విశ్వమంతయు ఆదిపురుషునియం దొకభాగమేయని పురుషసూక్తమందు చెప్పబడియున్నది. కనుక విశ్వ పరిశీలనవలన మనుజుని అల్పత్వము, భగవంతుని మహాత్వము వెల్లడి యగుచున్నవి. కాబట్టి మనము అహంకారమును వీడి పరమేశ్వరుని భజించి భగవత్ప్రీతికి పాత్రులగుదుముగాక!'' అని ఉపన్యసించిరి. ఆహా! ఎంతటి ముచ్చట గొలుపు మాటలు!

## కాశీనివాసము

ఇట్లు సద్గోష్ఠులయందు, సత్సాధనలయందును కాలము గడుపుచు హిందీయభాషయందు ఆంధ్రదేశమందలి పరీక్షలన్నిటిలోను ఉత్తీర్ణులై ఉన్నత హిందీ విద్యాభ్యాస మునకై కాశీపట్టణమునకు 1935 వ సంవత్సరమున వెళ్ళిరి. భారతీయునకు కాశీవాసము పవిత్రకార్యముగదా! కావున మన స్వాములవారికిన్ని చిన్నతనమున కాశీవాసయోగ మబ్బినది. అంతట వీరు, పట్టభద్రులగు మరికొంతమంది దాక్షిణాత్యులతో కలసి కాశీవెళ్ళి అట జాతీయముగా

నడచుచున్న కాశీవిద్యాపీఠమందు 'హిందీకోవిద' తరగతిలో ప్రవేశించిరి. ఈ కాశీ ప్రయాణమునకు వీరి గురువుగారి ప్రోత్సాహము ముఖ్యకారణమయినది. ఆ కాశీ విద్యాపీఠమున కానాడు ఆచార్య నరేంద్ర దేవ్ గారు ప్రిన్సపాల్ (ప్రధానాచార్యులు) గ నుండిరి. శ్రీ ప్రకాశ్ గారు, సంపూర్ణానంద్ గారు, బలబీర్ గారు మొదలగు ఉద్దండులు, దేశసేవాపరాయణులు అధ్యాపకులుగా నుండిరి. అట్టి ఉదాత్త దేశనాయకుల సంచాలకత్వ అధ్యాపకత్వములతో నడుచు విద్యాపీఠమందు ఒక సంవత్సరము వీరు విద్య నభ్యసించి 'హిందీకోవిద' యను పట్టమునందిరి. కాశీజీవితము వీరికి చాల విశిష్టముగా గడచినది. వీరి వసతి గదియందు వీరితోబాటు ఉత్తరప్రదేశ్ ప్రాంతీయుడైన గిరీశచంద్రపంత్ అను నతడు తోడివిద్యార్థియై స్నేహితుడాయెను. అతడు చాల గొప్ప ప్రజ్ఞావంతుడనియు, ఆధ్యాత్మికముగా చాల పరిచయము గలవాడనియు శ్రీవారపుడపుడు నాతో చెప్పుచుండిరి. అట్టివానిసాంగత్యం తోడుకాగా నిప్పుకు గాలితోడైనట్లు వీరి ఆధ్యాత్మిక సాధనలు మరింత వృద్ధినొందినవి. సెలవుదినములలో గంగానదిలో పడవపై విహారమేగి తన్నదీతీరస్థ మహాత్ముల నన్వేషించి దర్శించివచ్చుట వీరికొక సహజ క్రీడయైనది.

ఈ సందర్భములో ఒక ఘట్టమును వివరించుట సమంజసము. వీ రిరువురు (పంతు, ఆనందమోహన్) ఒకనాడు పడవపైపోయి గంగానదిని దాటి ఆవలిఒడ్డున ఉన్న

ఒక గ్రామమును చేరిరి. ఆ గ్రామమం దొక ప్రసిద్ధ మహాత్ముడు అవధూతవృత్తియందుండెను. ఆ మహాత్ముని దర్శనమే వీరి యుద్దేశ్యము. ఆ సత్పురుషుని యనుగ్రహము లభించుట జనులకు బహు దుర్లభమైయుండెను. మన ఆనంద మోహనులు పంతుతో కలసి వారి దగ్గరకుపోయిరి. కాశీ నుండి ఇద్దరు విద్యార్థులు దర్శనార్థమైవచ్చినట్లు దగ్గరనున్న వారు చెప్పగా ఆ మహాత్ములు దోమతెర పైకి తీసివేసి వీరినిచూచి దగ్గరకురమ్మని చెప్పిరి. అప్పటికి సాయంసమయ మగుటచేత భక్తుడగు ఒకానొక జమీందారును పిలిపించి 'వీరికి రాత్రికి వసతి, భోజనాదులు ఏర్పాటు చేయు' మనిరి. మఱియు ఆ యిరువురిలోను మన ఆనందమోహనుల చూచి "దక్షిణ్ మే ఆధ్యాత్మిక్ ధూమ్ మచాయం గే-" 'దక్షిణ భారతమున ఆధ్యాత్మిక క్రాంతిని కల్గింతువు' అని వారిని ఆ మహాత్ముడు ఆశీర్వదించిరి. మహాత్ములు త్రికాలజ్ఞులు. వారి వాక్యములు, ఆశీర్వాదములు వ్యర్థములు కావుగదా! చూడుడు! ఆ మహాత్ముడు నుడివినట్లు నాటి ఆనంద మోహనులే నేటి విద్యాప్రకాశానందులై దక్షిణభారతమున అపర వివేకానందులవలె ఆధ్యాత్మిక క్రాంతిని, ఉత్తేజమును కల్గించు చుండుట నేడు మనము గాంచుచున్నాముగదా! కాశీలోని విద్యాపీఠమందు వీరి సంపాదకత్వమున "తపోభూమి" యను హిందీ మాసపత్రిక (ప్రాచీన పద్ధతిలో వ్రాత ప్రతులుగా) ప్రారంభింపబడినది. దానిలోని వ్యాసములు ఉజ్జ్వలములు, హిందీ భాషయందు చక్కని సాహిత్యముగ అవి ప్రకాశించు

చున్నవి. కాశీయందు వీరు ప్రాణామాయ యోగాసనాదులను బాగుగ సాధనజేసిరి. అచటనే వీరికి రాహులసాంకృత్యాయనుల పరిచయము వారి బౌద్ధ గ్రంథముల పరిచయము ఏర్పడినది.

ఇట్లు వీరు ఆధ్యాత్మిక విచారణలతో, ఉత్తమహిందీ సాహిత్యములో కాలము గడుపుచుండ ఒకపుడు ఆ విద్యాపీఠమందు కాంగ్రెస్ కమిటీ సమావేశము జరిగినది. అత్తఱి గాంధీజీ, పటేల్, రాజేంద్రప్రసాద్ మున్నగు నాయకులచటికి విచ్చేసిరి. అపుడు గాంధీమహాత్ముని బసయొద్ద వాలంటీరుగా ఈ ఆనంద మోహనులను అధికారులు ఏర్పరిచిరి. ఆ సమయమున వారు స్వయముగ గాంచిన మహాత్ముని దినచర్య వారి నెంతయో ఆకర్షించినది. మఱియు భవిష్యత్తులో వారికి ఆదర్శవంతమైనది.

## 'గంగాయాం గీతా'

కాశీనివాసము ఒక సంవత్సరము పూర్తికాగా, విద్యాభ్యాసము ముగిసినందున ఆనందమోహనులు, హిందీవిద్యార్థినిగా అలహాబాదు వచ్చియుండిన వారి సోదరి, కాశీ విశ్వవిద్యాలయమందు M. A. L. L. B. చదువుచున్న ఆమె భర్తగారు (ఇలింద్ర రంగనాయకులుగారు) ఒకచోట కలసికొని అటనుండి హృషీకేశాది ఉత్తర భారత యాత్రను పూర్తిచేసికొని ఇంటికి తిరిగి వెళ్లవలెనను నిశ్చయమును చేసికొనిరి. ఈ సందర్భములో వీరికొక సమస్య ఎదురాయెను. తన విద్యాభ్యాస మింతటితో పూర్తియగును. స్నేహితులు,

కొందరు బంధువులు ఇంకను ఆంగ్లమున ఉన్నతవిద్య నభ్యసించులాగున వారిని ప్రోత్సహించ దొడంగిరి. ఇక విద్యను చాలించి ఆశ్రమజీవితమును గడుపుమని తల్లిదండ్రు లనుచున్నారు. గురువుగారగు శ్రీ మలయాళ స్వాముల వారున్ను అట్లే ఆదేశించుచున్నారు. తనకున్ను ఆశ్రమ జీవితమందే ఇచ్ఛయున్నది. కాని దానికంత ప్రబలత చేకూరక అపుడపుడు ఉన్నతవిద్యవైపు నకున్ను మనస్సు మొగ్గు చూపుచున్నది. 'ఇపుడు భావిజీవిత కర్తవ్యమేమి?' అని డోలాయమానులగుచుండిరి. ఇట్లుండగా కాశీ వదల వలసిన సమయ మాసన్నమాయెను. సోదరి అలహాబాదునుండి వచ్చి కాశీ చేరెను. సోదరిభర్తకు కాశీ హిందూ విశ్వ విద్యాలయములో (M. A. L. L. B.) విద్య పూర్తి యైనదిగాన అందరును కలసి కాశీవదలి హరిద్వారము చేరిరి. హరిద్వార ములో ఆ నాడు వీరు ముగ్గురూ కలసి గంగాస్నానమునకు వెళ్ళిరి. ఆనందమోహనుగారు తనస్నానానంతరము నదిలో కట్టబడియున్న ఒక 'బోటు' లోనికిపోయి అందు కూర్చొని నదిని తిలకించుచుండిరి. అంతలో ఆ సమీపమున నదియం దొక గడ్డికుప్ప కొట్టుకొని వచ్చుచుండుట వీరి కంటపడెను. వీరు వంగి వెంటనే దానిని చేతితో తీసి పడవలో వేయగా అందు ఒక నాగరిలిపి భగవద్గీత కుంకుమ పుష్పపూజితమై కన్పించెను. వెంటనే ఆనందుడు ఆనందాతిరేకముతో ఒక గంతువేసి తమ సోదరిని, బావగారిని పిలచి వారి కద్దానిని చూపి ఇక తన భావిజీవితమును ఆశ్రమమునందే గడిపి

"లోకమునకీ గీతా సేవ జేయు" మని భగవదాదేశమై యున్నది. కావున యాత్ర అయినదే ఇంటికేగి అటనుండి ఆశ్రమము వెళ్లెదనని తీర్మానించి తమ కెదురైన సమస్యను పరిష్కరించిరి. మహాత్ములకు దైవ మెట్లు తోడగునో చూడుడు! అటుపిమ్మట వారు హృషీకేశము, లక్నో, ఆగ్రా, మొదలగుగాగల ప్రదేశములను, క్షేత్రములను దర్శించి తిరిగి వచ్చి ఇల్లు చేరిరి

## శ్రీ వ్యాసాశ్రమ ప్రవేశము - ద్వాదశవర్ష తపము

ఇంటినుండి తల్లిదండ్రుల అనుమతితో గురుదేవుల ఆజ్ఞప్రకారము 1936 వ సంవత్సరం మే నెల 17 వ తేది ఏకాదశి పవిత్ర దివసమున ఆనందమోహానులు గురుకుల వాస మొనర్చుటకును, పరిపూర్ణ సాధనలు చేయుటకును పూర్ణ నివృత్తికొఱకును శ్రీ వ్యాసాశ్రమమున ప్రవేశించిరి. అంతట ఇదివరలో గాయత్రీజపము, పంచాక్షరీ జప ములచే మలదోషము నివృత్తికాగా ఉత్తమ ధ్యానాది సాధనలచే విక్షేపదోషము తొలగగా మిగిలిన ఒక్క ఆవరణదోష నివృత్తికై వీరికి సద్గురువు మహావాక్యోప దేశము చేయ నిశ్చయించెను. ఆశ్రమమున ప్రవేశించిన మరురోజు 18-5-36 తేదీ ద్వాదశి దినమున ప్రాతఃకాల బ్రహ్మ ముహూర్తమందు శ్రీ సద్గురు మలయాళ స్వాముల వారు ఈ శిష్య రత్నమును స్వయముగ పిలచి "ప్రజ్ఞానం బ్రహ్మ" ఇత్యాది మహావాక్యముల నుపదేశించిరి. ఆ జ్ఞానోపదేశముచే ఈ శిష్యరత్నముయొక్క ఆవరణ దోష మున్ను పటాపంచలైనది.

## గ్రంథరచన - తీవ్రసాధన

శ్రీ వ్యాసాశ్రమమందు ధ్యానమునకై వీరు ఏకాంతముగ ఒక కుటీరమును ఎన్నుకొనిరి. అది చుట్టూ పుట్టలతో నిండి చిట్టడవిలో నున్నదై ఆశ్రమములో చివర ఏకాంతముగా జన సంచారము లేక గుహావలె నుండుటచే గుహాశ్రమమని దానికి పేరు పెట్టబడెను. ఆ కుటీరమందు రోజు ఒకటికి ఒక కొబ్బరికాయ, రెండు గుప్పెళ్ళు నానవేసిన గోధుమలు, శెనగలు, నాల్గు అరటిపండ్లు ఆహారముగా గైకొనుచు, మహావాక్యములయొక్క మనననిది ధ్యాసములను చేయుచు ధారణాధ్యానములను తీవ్రముగా గావించుచు ప్రాతఃకాలమున గురు సన్నిధియందు ఆశ్రమ సమష్టి ప్రార్థనా గీతా పారాయణాదులందు గీతను మొదట చెప్పుచు, గ్రంథపఠనము చేయుచు, సాయంకాల సమావేశమందు యోగవాసిష్ఠ రామాయణమును చదివి అందలి భావములను ఆశ్రమభక్తులకు ఉపన్యసించుచు తక్కిన సమయమందు తన ఏకాంతసాధనను చేసికొనుచుండిరి. ఇంద్రియ నిగ్రహములో వీరిది అందెవేసినచేయి. ఆశ్రమములో శ్రీ సద్గురు మలయాళ స్వాములవారిని పెద్ద స్వాములనియు, వీరిని చిన్న స్వామియనియు ఆనందస్వామి యనియు అందరు అనుచుండిరి. ఆశ్రమ దర్శనమున కేతెంచిన ప్రతిభక్తుడు శ్రీ సద్గురు స్వాముల (పెద్దస్వాముల) దర్శనానంతరం ఈ చిన్నస్వామిని దర్శించుట అలవాటై పోయినది. దర్శనార్థులను వీరు ప్రసన్న

వదనముతో వీక్షించి, చిరునగవుతో వారితో ఒకటి రెండు మాటలాడి వెంటనే పంపివైతురు. సమయమును ఏ మాత్రము వ్యర్థపుచ్చరు. వారి నివాసమందు "ఆయుషః క్షణ ఏకోపి సర్వరత్నైర్న లభ్యతే, నీయతే తద్వృథా యేన ప్రమాదః సుమహానహో" అని పెద్ద నల్లటి అక్షరములతో వ్రాసి పెట్టికొని యుండిరి. అనగా ఆయుస్సును వ్యర్థము చేయరాదని భావము. వీరు చూచుట కెంత గంభీరముగ గోచరింతురో అంత సరళ హృదయులు కావుననే నీటపడిన చిన్న పురుగును గూడ చూచి సహించడంలేదు. బాధతో నున్న వానిని చూచినను సహించలేరు. తాము అపక్వాహారులు గాన తమకు భక్తులు దర్శనమునకు వచ్చునపుడు తెచ్చియిచ్చు మంచి మంచి ఫలహారములను ప్రక్కన అడవికి పోవు పశువుల కాపరులను పిలిచి పెట్టివేయుచుండిరి. కావున ఆ పరిసర పశువుల కాపరులకు ఆనందస్వామి యనిన గొప్ప అభిమానము. వారి కుటీర పరిసరములందు పాము లత్యధికము. పెద్ద, చిన్న పాము లధికముగా చుట్టూ తిరుగుచుండును. అపుడపుడు గదిలోనికి కూడ అవి వచ్చుచుండును.

ఈ సందర్భంలో ఒక సంఘటన జ్ఞాపకమునకు వచ్చినది. దాని నిట నుటకింతును. రోజూ స్వామీజీ రూము ముందు పందిరి క్రింద అరుగుపై శయనింతురు. అట్లే రాత్రి శయనించియుండ నొకరోజు స్వామీజీకి నిద్రయందు "తన శిరస్సునకు నేరుగా పైన పందిరిపై ఒక సర్పము ఉన్నట్లు" ఒక దృశ్యము గోచరించినది. వెంటనే శ్రీవారికి మెలకువ

వచ్చి పైకి లేచి ప్రక్కనున్న బ్యాటరీ తీసి పైన పందిరిపై వేయుద మనుకొన్నంతలో ఆ పాము పైనుండి సరిగా శ్రీవారు పండుకొని యున్నప్పుడు శిరస్సుండిన చోటనే దభామని పడినది. ఏమిటి శబ్దమని శ్రీవారు బ్యాటరీ వేయగా పాము. ఆపైన అటనుండి అది చరచరా కదలి పారిపోయినది. చూచితిరా దైవలీల! "యోగక్షేమం వహామ్యహం" అన్న భగవత్ప్రతిజ్ఞ కిది యొక నిదర్శనముగదా! శ్రీవారికి నిద్రలో ఏ దృశ్యము గోచరించినదో అది నిజమేయైనది. అత్తరి వారు నిద్రనుండి లేవకుండిన, పాము శ్రీవారి శిరముపై పడియుండెడిదిగదా! గాన దైవము ఆ ఘట్టమున ఎట్లు రక్షించినదో చూడుడు. దైవముపై భారము వేసిన మన భారము నా దేవదేవుడే వహించును. "న మే భక్తః ప్రణశ్యతి" అని భగవానుని అభయవాణిగదా!

పాములు కీడు చేయునవైనను వానిని చంపుటకు స్వాముల వారిష్టపడరు. కావున ఆ పాములకై ఒక రకమైన బోనును వీరు తయారుచేయించిరి. రూములోని కేతెంచు పాములు యథేచ్ఛగా పోయినసరి. లేకున్న వానిని పెద్ద పొడుగాటి పట్టకారుతో పట్టి బోనులో వదలి వానిని కొండలో దూరముగా వెళ్ళి వదలిపెట్టి రావలె. ఇది వీరి నియమము. చూచితిరా ఎంత కరుణార్ద్ర హృదయమో వీరిది! కరుణలో వీరికి బుద్ధుడు ఆదర్శమూర్తి. బుద్ధడనిన, బౌద్ధమతమనిన వీరికి గొప్ప ఆదరము, గౌరవమున్ను గలదు. కావుననే వీరు వ్యాసాశ్రమ తాపస జీవిత

సమయమున "ధర్మపదము" అను బుద్ధగీతను తెనిగించిరి. అట్లే కఠోపనిషత్తు, యోగవాసిష్ఠము, వివేకచూడామణియు వీరికి అతిఇష్టములు. యోగవాసిష్ఠ మహాగ్రంథమును ఆ సమయమున సంస్కృతభాషనుండి వీరు తెనిగించిరి. వీరు అనువదించిన యోగవాసిష్ఠ, ధర్మపదములను గ్రంథములను శ్రీ వ్యాసాశ్రమమువారు ప్రచురించిరి. ఈ ఆనందస్వామి బాల్యమునందే హృదయము నాకర్షించిన లక్ష్యమూర్తి శ్రీ వివేకానందస్వామి. కనుక వీరి హృదయము ఎల్లప్పుడు ఉత్సాహముతో, ధీరత్వముతో నిండియుండును. వివేకానందుని "Be fearless." (నిర్భయముగ నుండుడు) అను వాక్యము వీరికి ఇష్టమంత్రము. కాన వీరి గుహాశ్రమ కుడ్యములందు (గోడలపై) ఈ మంత్రమే దేదీప్యమానముగ గోచరించెడిది వీరి తాపసిక జీవితమందు ఒక సంవత్సరము పూర్ణమౌనముతో, తీవ్ర సాధనలతో గడచినది. ఆ సందర్భములో సమాధిమగ్నులైన వీరు ఆకలిదప్పులు లేనివారై రోజులో ఎప్పుడో ఒకమారు కొద్ది అపక్వాహారమును మాత్రము స్వీకరించిన సందర్భములు గలవు. తీవ్రసాధనలచేతను, అతిస్వల్ప ఆహారముచేతను వీరి శరీరము చాల కృశించిపోసాగినది. అపుడు వీరు పెద్దలసలహా మేరకు చాల ప్రోద్బలముపై రోజుకు రెండుచిట్ల పాలను తీసికొనుట కంగీకరించిరి. వీరి సాధనలోని ఘట్టములను వ్రాయవలెనన్న అదొక బృహద్గ్రంథమగును. వారి 'సాధనడైరీ'ని చూచినచో మనోజయమునకు, ఇన్ద్రియదమమునకు వారుచేసిన సాధనలు, వాని

ఫలితములు అద్భుతములుగా, బహుళములుగా నుండగలవు. 1942 సం॥ నుండి వీరు తమ ఏకాంతకుటీరమును వీడి బయటకు రాక (సకృత్తుగా శ్రీ సద్గురుసన్నిధికి మినహా) చాల తీవ్రముగా సాధనచేయుచు తమ దర్శనార్థులతో ముక్తసరిగా మూడు మాటలాడి పంపుచు తమ సాధనను తీవ్రముగా చేసిరి. వీరు చాల వైరాగ్యపురుషులు. ఆంగ్ల పట్టభద్రులయ్యు ప్రాచీనపద్ధతిని కట్టుబాట్లు గల్గి చాల వైరాగ్య జీవితమును గడపుచుండిరి. "యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః" అనునట్లును "ఇహోహ్యపస్థపరిత్యాగే సో నముచ్యేతబంధనాత్" అనునట్లును వీరు స్వల్ప అపక్వాహారమును గ్రహించుచు మౌనముతోను, లేక మిత భాషణముతోను గూడి జనసంగము లేక ఏకాంతముగా వసించుచు జితేంద్రియులై "వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః, ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః." అను గీతావాక్యరీతి శ్రీ వ్యాసాశ్రమమున గురుసన్నిధియందు ఆనందమోహానులు ద్వాదశవర్షములు (పండ్రెండేండ్లు) ధ్యాననిష్ఠయందుండి శ్రవణమనన నిదిధ్యాసములచే బ్రహ్మాకారవృత్తినొంది ఆ పైన వృత్తిరహితులై సమాధ్యనుభవముచే ఆనందముగ నుండిరి. అపుడు వీరి గురుదేవులు ఈ ఉత్తమ ఆదర్శశిష్యునకు తమ చేతులార ప్రథమముగా సన్న్యాస మివ్వదలంచిరి. ఆనందమోహానులున్ను ఎప్పుడెపుడు గురుదేవుడు సన్న్యాస మిచ్చునాయని కాచుకొని యుండుటచే అమితానందముతో ఉప్పొంగిపోయెను. అయితే

సన్న్యాసగ్రహీత కఠోపనిషత్తు, పతంజలి యోగశాస్త్రము, భగవద్గీత అను ఈ మూడింటిని కంఠస్థము చేసియుండవలెను. అది శ్రీ వ్యాసాశ్రమ నియమము. కాని శ్రీసద్గురు మలయాళస్వాములవారి యీ నియమము వీరిపట్ల చర్చకే రాలేదు. ఏల యనిన వీరి కవి చిన్ననాటనే కంఠస్థములై యున్నవి.

## సన్న్యాస (తురీయాశ్రమ) స్వీకారము

అంతట నిశ్చయింపబడిన ముహూర్త ప్రకారము 29-6-1947 నుండి 3-7-47 వరకు (సర్వజిన్నామ సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి ఆదివారంనుండి పౌర్ణమి గురువార పర్యంతము) పంచాహ్నిక విధానమున శ్రీవారి సన్న్యాస స్వీకారము జరిగెను. ఈ ఉత్సవమునకు దేశముయొక్క నలుమూలలనుండి రెండు వేల మంది ప్రేక్షకులు, భక్తులు వచ్చియుండిరి. ఆ యుత్సవము కన్నులకింపుగా బ్రహ్మానందముగా నుండెను. సన్న్యాసస్వీకరణోత్సవ మింత శాస్త్రీయముగా, ఇంత ఆనందముగా, గొప్పగా ఎప్పుడును జరిగియుండ లేదని భక్తు లనుకొనిరి.

ఈ తురీయాశ్రమ స్వీకారము సనాతన వైదికపద్ధతి ననుసరించి ఋష్యాశ్రమమునందు పంచాహ్నిక విధానమున జరుపబడెను. ప్రథమదినమున ఆషాఢ శుద్ధ ఏకాదశిరోజు బ్రహ్మముహూర్తమున గుర్వాజ్ఞను బడసి ఆనందమోహన్ కొందరు సన్న్యాసులు, భక్తులు వెంటరాగా కాళహస్తి పుణ్యక్షేత్ర తీర్థమునకు యాత్ర జేసి పావన సువర్ణముఖి

స్నానము చేసి, జ్ఞానప్రసూనాంబాసహిత కాళహస్తీశ్వర దర్శనము చేసికొని తిరిగి ఆశ్రమము వచ్చి చేరిరి. రెండవరోజు ఉదయం 9-30 నుండి 10-30 లోపల బ్రహ్మచారి ఆనందమోహన్ గురుదేవులు, యతులు, పండితులు భక్తులు గల (సమావేశమునకు) సభకు ప్రదక్షిణ నమస్కారముల నొనర్చి సభామధ్యమున ఆనందమోహనులు తన మాతృదేవి గారికి సాష్టాంగ వందన మొనర్చి "మాతః సన్న్యస్తు మిచ్ఛామి దేహ్యనుజ్ఞానం శుభాంహి మే: సన్న్యసేనైవ నిర్వాణమితి వేదాన్త నిశ్చయః" అని సన్న్యాసానుజ్ఞను అడుగగా అందులకు ఆ పునీతయగు మాత తన యంగీకారమును "సాధు వత్స త్వయాప్రోక్తం యథేచ్ఛసి తథాకురు, యతః సన్న్యసనాత్తాత సఫలం జన్మమామకం" "పితరం మాంచ లోకాంశ్చ స్వాత్మానం వంశమేవచ, పితౄన్ దేవాం స్తథా సర్వాన్ ఉద్ధర త్వం గుణాంబుధే" అనుచు ఆనందముతో "నా పుత్రుడు ఆనందమోహన్ తాను సన్న్యాసాశ్రమమును స్వీకరింప నిచ్ఛగించి ఇందులకై విధి ననుసరించి తల్లియైన నా యనుమతి అవసరమని కోరినందున అట్టి నా యనుమతి నేనిప్పుడు హృదయపూర్వకముగ మహానందముతో నొసగుచున్నాను. అయితే ద్వాదశవర్షముల క్రిందటనే తల్లిదండ్రులమైన మేము మా కుమారునకు స్వామి వివేకానందుని జీవితరహస్యములను బోధించి బుద్ధిపూర్వకముగ సన్న్యాసమునకు ప్రేరేపించి గృహమునుండి సాగనంపితిమి. ఆ యనుమతినే తిరిగి ఈ సుదినమున బ్రహ్మ

నందముతో ధ్రువపరచి కృతకృత్యులమగుచున్నాము. పుత్ర రత్నమా! ఈసన్న్యాసస్వీకారమువలన స్వామి వివేకానంద వలె నీవును తరించి "తథా సర్వాన్ ఉద్ధర త్వం గుణాం బుధే" అని సభలో నుపన్యసించెను. ఆహా! ఆదృశ్య మింత వరకు ఎవరును ఎచ్చటను చూచియుండలేదు. భారత చరిత్రలో తల్లి ఇచ్ఛాపూర్వకముగా సభయందు పుత్రులకు సన్న్యాసానుజ్ఞ ఇచ్చిన స్వర్ణఘట్ట మిదియొకటే అనిపించుచున్నది. ఆ తల్లి ఎంత ధన్యయోగదా! మూడవదినమున సన్న్యాస ప్రతిగృహీతయగు ఆనందమోహనునిచే గణపతి పూజ, విష్ణుప్రభృతిదేవతాపూజ, నవగ్రహపూజ, హోమము జరిపింపబడిన పిమ్మట అష్టనాందీముఖ శ్రాద్ధములు చేయబడెను. ఈ ఘట్టముతో వీరికి దేవ, పితృ, మనుష్యాది సంబంధ సర్వకర్మములనుండి విముక్తి సిద్ధింప, కర్మకాండయొక్క తుదిఘట్టమున్ను పూర్తియైనది. ఇక వీరికి కర్మకాండతో అవసరమే లేదు. ఇక నాల్గవరోజంతయు మౌనముతో ఉపవాసముండి మంత్రపురశ్చరణమును చేసిరి. ఐదవరోజు ప్రాతఃకాల బ్రహ్మముహూర్తమున విరజాహోమమును జేసిరి. ఆపై ఆ బ్రహ్మముహూర్తమునసే గురుదేవులు, యతిపుంగవులు, భక్తులు మంత్రోచ్చారణతో వెంటరాగా, మంగళవాద్యములు మ్రోగుచుండ ఆశ్రమమందలి తామరకొలనుకు వెళ్ళి అట గురువునకు నమస్కరించి సన్న్యాసమును గూర్చిన సంకల్పము గావించి ఆపై సావిత్రీప్రవేశముచేసి నాభిప్రమాణజలమందు నిలచి ప్రాఙ్ముఖుడై (బ్రహ్మచారి ఆనందమోహన్)

ములతో తయారుచేసిన కమండలువు నొసంగిరి. దానిని శ్రీ మహర్షి మలయాళస్వాములవారు తమ ఈ శిష్యునకు సన్న్యాస మొసంగిన సందర్భములో ఆ కమండలువు చరిత్రను చెప్పి మా గురువుగారిచ్చిన దీనిని మీకు ఇచ్చుచున్నామని చెప్పి ఇచ్చిరి. తమ ప్రియతర సన్న్యాసశిష్యునకిది తగిన గౌరవమే కదా! ఇయ్యది సత్పాత్రదానమే. (ఇది పరంపరకు ముఖ్యచిహ్నముగ నేటికిని జాగ్రత్తపరచబడియున్నది.)

## శ్రీ శుకబ్రహ్మాశ్రమస్థాపన

తదుపరి శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు కొంతకాలము శ్రీ వ్యాసాశ్రమముననే యుండి తాము వేరుగా ఒక ఆశ్రమమును స్థాపించదలంచినవారై ఏర్పేడునకు సమీపమునగల దక్షిణకాశియను శ్రీ కాళహస్తిక్షేత్రమున పావన సువర్ణముఖీనదీతీరమున శ్రీ శుకబ్రహ్మాశ్రమ మను పేర ఒక ఆశ్రమమును స్థాపించిరి. ఏతదాశ్రమ ప్రారంభోత్సవము 1950 సంవత్సరము జనవరి నెల 20 తేది, విరోధినామ సంవత్సర మాఘ శుద్ధ విదియరోజున ప్రాతఃకాలం 4½ గంటలకు శ్రీవారి గురుదేవులగు శ్రీ శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారి అమృతహస్తములచే గావింపబడెను. ఇపుడా యాశ్రమము భక్తుల సహాకారముచే పూజామందిరము, భోజనశాల, అతిథిమందిరము, బీదలకు ఉచిత వైద్యాలయము, మొదలైనవి గల్గి సకల సౌకర్యములతో గూడి బ్రహ్మాండముగా నభివృద్ధినొందుచు సదా భక్తజనులతో కళకళలాడుచున్నది. దాని మూర్తిోత్సవము 1962 సం॥ మార్చినెలలో అతి వైభవముగా జరిగిన విషయము సర్వులు

ఎఱిగినదే. మఱియు శ్రీ మహర్షి మలయాళస్వాములవారు తాము స్థాపించి ప్రతి సంవత్సరము నడుపుచున్నట్టి శ్రీ సనాతన వేదాంతజ్ఞానమహాసభకు అధ్యక్షులుగ శ్రీ విద్యాప్రకాశా నందగిరి స్వాములవారిని 1955 సం॥ నియమించిరి. తదాదిగ నేటివఱకును వారే ఆ మహాసభకు అధ్యక్షులుగ నుండుచు ఆ కార్య క్రమమును జయప్రదముగ నడుపుచుండిరి.

## శ్రీవారి ప్రవచనములు

శ్రీ స్వాములవారి ప్రవచనములు చాల తేలిక భాషలో మృదుమధురముగ శ్రవణానందముగ నుండును. వీరి ఉపన్యాసములకు వేలకొలదిజనులు వచ్చి నిశ్శబ్దముగా నుండెదరు. వీరికి దేశముయొక్క నలుమూలలనుండి ఆహ్వానములు అనేకముగ వచ్చుచుండును. అచటచట గీతా యజ్ఞములను జరుపుచు, ఆయా ప్రదేశములందు 18 దినములు రోజుకొక అధ్యాయముచొప్పున గీతను విపులముగ బోధించుచు, ఉదయము వసిష్ఠగీత (యోగవాసిష్ఠము)ను బోధించుచు అనుష్ఠాన పద్ధతులను వివరించుచు శ్రీవారు అమోఘముగ ఆధ్యాత్మిక ప్రచారమును గావించిరి. వీరు ఉపన్యసించిన ప్రదేశములలో— బెంగుళూరు, మైసూరు, కోలారు, కొళ్ళేగాల్, ఖర్గపూర్, మద్రాసు, చిత్తూరు, బళ్ళారి, ప్రొద్దుటూరు, నెల్లూరు, విజయవాడ, తెనాలి, గుంటూరు, నరసారావుపేట, బందరు, ఏలూరు, కాకినాడ, విజయనగరం, విశాఖపట్టణం, హైదరాబాదు మొదలగునవి గలవు. శ్రీ స్వాములవారు 100 గీతాయజ్ఞములను పూర్తిచేసిరి. మాఱవ గీతాయజ్ఞము 1981 వ సంవత్సరమున హైదరా

బాద్ లో జరిగినది. వీరు తెనాలిలో ఇచ్చిన ఉపన్యాసములను గూర్చిఆంధ్రప్రభ ప్రకటించినది చూడుడు-"శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వాములవారు తమ సరళమైన భాషలోబహుజనాకర్షణీయంగా గీతోపన్యాసాలు చేస్తున్నారు. ప్రతిదినం అశేష ప్రజానీకం హాజరవుతున్నారు," మఱియు, కాకినాడ ఉపన్యాసములనుగూర్చి "జనశక్తి" అనుస్థానికపత్రిక ఉల్లేఖించినది చూడుడు- "శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు దివ్యజ్ఞాన సమాజమందిరములో పండితులకు పామరులకు గూడ అర్థమయ్యేరీతిగా ఉపన్యసిస్తూ ఆత్మ తేజమును తెలిసికొనుటకు గీతామృతము నందిస్తున్నారు. మనోనేత్రములను తెరిచే ఉపన్యాసములు. ఈ స్వామి ఉపన్యాసములు ప్రజానీకాన్ని విశేషంగా ఆకర్షిస్తూన్నాయి. ఇయ్యవి వ్యక్తుల జీవితములను ఉత్తేజపరచి వెలుగు చూపేవిగా ఉన్నాయి." ఇట్లు శ్రీవారు తమ ప్రవచనములచే దేశములోని ప్రజలకు ఆధ్యాత్మిక విజ్ఞానము నొసంగుచుండిరి. వీరు వాసిష్ఠ రామాయణమును అనగా యోగవాసిష్ఠమును సంక్షేపించి "వసిష్ఠగీత" యని వ్రాసి ప్రచురించిరి. వీరి గీతోపన్యాసములు గ్రంథరూపమున వెలువడినవి. మరియువీరు "గీతామకరందము" అను పేరుతో గీతకు 1100 పేజీలు గల గొప్ప వ్యాఖ్యను వ్రాసిరి. అదియు ప్రచురితమై జనులలో విరివిగ ప్రచారమగుచున్నది. అంతే గాక భక్తుల కోర్కెపై "వేదాంతభేరి" అను ఆధ్యాత్మిక మాసపత్రికను 1963 సంవత్సరంనుండి ప్రారంభించి 18సంIIలు విజయవంతముగ నడిపిరి. ఇట్లు శ్రీవారు లోకోత్తరపురుషులై తాము

తరించినదే కాక ఇతరులనుగూడ తరింపజేయుచున్నారు. ఇది మహాభాగ్యము. ఇట్టి ఆదర్శ పవిత్ర మహాత్ములను మనము ముందుంచుకొని వారి బోధలను ఆచరణలో బెట్టి మనమున్ను శాంతి నొందెదముగాక !

పరాపరేతి విద్యాభ్యాం సమలంకృతవాన్ యతః
విద్యాప్రకాశేతి నామ తతోఽన్వర్థం హి తే గురో॥
ఓమ్ తత్ సత్.

## సదుపదేశములు

(శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు)

1. సాధకుడు ప్రారంభమున చిత్తమును ప్రార్థనా, నామస్మరణాదులచే పరమార్థరంగమున ఒకింత పైకిలేపి, అపిదప తత్త్వవిచారణచే ఊర్ధ్వముగ గొనిపోవలెను.

2. మనస్సు రాగాది కషాయయుతమై మలినముగా నున్నచో దైవమునందుగాని, దైవవాక్యమునందుగాని, అభిరుచి గలుగదు. కావున విషయభోగములందు విరక్తి గలిగి యుండవలెను.

3. బ్రహ్మజ్ఞానసాధమునకు వైరాగ్యము పునాది వంటిది. పునాది గట్టిగ లేనిచో ఎంత పెద్ద భవనమయినను అచిరకాలములో కూలిపోవునట్లు విషయ విరక్తి సంపూర్ణముగ లేనిచో తత్త్వజ్ఞానము నిలువదు. కావున సాధకుడు సంపూర్ణ విషయ విరక్తి కలిగియుండవలెను.

4. $\frac{\text{దైవము}}{\text{మాయ}}$ అను భిన్నము (fraction) లో క్రింది సంఖ్యయగు మాయ అధికమగు కొలది పై సంఖ్య యగు

దైవము తగ్గుచుండును. అట్లే మాయాగుణములు, ఆశా పిశాచము, కామక్రోధాదులు, జీవునియందు ఎంతెంత అధికమగుచుండునో ఆతనియందున్న దైవత్వము, అంతంత సన్నగిలిపోవుచుండును. అవి ఎంతెంత తగ్గుచుండునో దైవత్వము అతనియందంతంత ప్రబలుచుండును. ఏనాడు ఈ మాయాగుణములు సంపూర్ణముగ తొలగిపోవునో, అప్పుడు కైవల్యముమాత్రము శేషించును.

5. బిడ్డ ఊయలయందు పరుండి ఏడ్చినచో తల్లి అన్ని పనులు వదులుకొని అచటికి పరుగెత్తుకొనివచ్చి అతని యోగక్షేమముల విచారించునట్లు భక్తుని మొరను భగవంతుడు ఆలకించుచునే యుండును. కావున మీ దృష్టిని ప్రాపంచిక సుఖములనుండి మరల్చి దైవమునందు నిలిపి ఆ దైవముకొరకై పరితపించుడు.

6. దేవుడున్నాడా? ఉన్నచో మాకు కనుపించుట లేదే? అని యనకుడు. కనుపించనివస్తువు లేదనుట సిద్ధాంతమైనచో వాయువు కన్నులకు కనుపించునా? ఆకాశము కనుపించునా? తన కన్ను తనకు కనుపించునా? పగలు నక్షత్రములు కనుపించునా? లేదు. అంతమాత్రముచేత అవేవియు లేవనవచ్చునా? కాదు. పాలలోని వెన్న స్థూల నేత్రమునకు కానరాదు. కాని వివేకముతో తెలిసికొనవచ్చును, ప్రయత్నముతో ప్రత్యక్షముగా చూడవచ్చును. అట్లే భగవంతుని వివేక నేత్రముతో చూడవచ్చును. సాధన చేసినచో ప్రత్యక్షముగ భగవదనుభూతిని పొందవచ్చును.

7. ఈ ప్రపంచమునగల ప్రతివస్తువున్ను పరిణామ

శీలమైనది. ఈనాడు రమణీయముగనున్న పుష్పమాల రేపటికి వాడిపోవుచున్నది. ఆమరునాటికి క్రుళ్ళిపోవుచున్నది. నేడెంతయో రమణీయముగనున్న సౌధములు, నగరములు, కొంతకాలమునకు శిథిలములై కేవల స్మృతిమాత్రముతో శేషించుచున్నవి. ఇప్పుడిచటనున్న అణువు రేపు సూర్యుని లోనికి పోవచ్చును. సూర్యునిలోని అణువు రేపు ఇచ్చటికి రావచ్చును, ప్రతి ఏడుసంవత్సరములకు ఈ శరీరములోని అణువులన్నియు పోయి క్రొత్త అణువులు చేరునని విజ్ఞాన శాస్త్ర సిద్ధాంతము. ఈ ప్రకారముగ దృశ్యమంతయు పరిణామశీలమై యున్నది. కాని ఇవన్నియు మారుచున్నను నశించుచున్నను ఏ పరిణామము లేనిదై, అవినాశియై, వీని కన్నింటికిని ఆధారమైనట్టి వస్తువొకటి కలదు. అదియే దైవము. అట్టి దైవమును హృదయములో దర్శించుము.

8. మానవజన్మము సార్థకము కావలెనని ప్రజ్ఞాన రూప బ్రహ్మమును అనుభూతము చేసికొనవలెను.

9. సామాన్యమానవుని శక్తులన్నియు నశ్వరములగు ప్రాపంచిక పదార్థములను ధ్యానించుటయందే వ్యర్థములై పోవుచున్నవి. కాని నీవు అట్లు చేయక నీ శారీరక, మానసిక శక్తులన్నిటిని, దైవధ్యానమునందే వినియోగించుము, ఏలయనిన, ఈప్రపంచమున భగవంతుడొక్కడే సత్యము, స్థిరము. మిగిలినదంతయు అసత్యము, అస్థిరము.

10. నీవు ధ్యానించునప్పుడు ధ్యేయవస్తువు తప్ప అన్యమేదియు చిత్తమున ఉదయించకుండులాగున ప్రయత్నించుము. ఒకవేళ ఉదయించినను, ఆయా దృశ్యవస్తువు

లను. సంకల్పములను బలాత్కారముగా తొలగింపక, ఉపాస్యదైవమునందే దృష్టిని సంలగ్నపరచుము. అప్పుడవి వానియంతటవియే తొలగిపోవును.

11. ఏప్రీతితో అభీప్సిత ప్రాపంచిక వస్తువునుగూర్చి చింతన చేయుచున్నారో, అట్టి ప్రీతితో భగవంతుని చింతన చేసిన చాలును. లక్ష్యము కరతలామలకమైపోవును. ఇందులకు దైవమునందు అచంచల విశ్వాసము, భక్తి ఆవశ్యకములై యున్నవి, కావున జనులారా! నియమము లేర్పరచుకొని దినమందు కొంతసేపయినను, దృష్టిని బహిఃప్రపంచము నుండి మరల్చి అంతర్ముఖ మొనర్చి, భగవత్తత్త్వమును ధ్యానించెదరుగాక! పాపనాశనమునకు, అలౌకిక దివ్యానుభూతికి ఇది యొకటియే మార్గమని మఱువకుందురుగాక!

12. అమూల్యమగు ఈ జన్మను ఇంద్రియ సౌఖ్యములకొఱకు ధారపోసి తుదకు శోకసంతప్తులగుట విజ్ఞులకు, పాడిగాదు. కావున ఓ సాధకుడా! రేపు, రేపు అనక, ఇప్పటినుండియే పరమాత్మ చింతన కుపక్రమించి, బ్రహ్మానంద సామ్రాజ్యాభిషిక్తుడవుకమ్ము.

13. అసంతుష్టునికి ఏకాలమందును శాంతి లభించదు. ఏలయనగా మనస్సు 'ఇది కావలెను. అదికావలెను, ఇది చాలదు, అది చాలదు' అను ఆందోళనతో నిండియుండి మహాచంచలమై యుండును. చంచలమనస్సు కలవానికి శాంతిసుఖములు ఏనాడును సంప్రాప్తించవు. కావున జీవితములో సర్వేశ్వరుడిచ్చిన దానితో సంతుష్టి నొంది వ్యవహరించువాడు ధన్యుడు.

14. రాత్రి పరుండబోవునప్పుడు ఇంటిలో నొక పాము జొరబడినదనుకొనుడు. పెట్టెల సందులలో దూరి, ఎక్కడను కన్పించలేదనుకొనుడు. అత్తటి ఆ రాత్రి ఆ యింటియందున్నవారికి నిద్రపట్టునా? ఎట్లైనను మేల్కొని యిల్లంతయు వెతికి వెతికి దానిని చంపుటయో సాగనంపుటయో చేయుదురుకదా! అట్లే మన హృదయములందు అనాదిగ ఆశ్రయము కల్పించుకొని, మనలను భాధించుచు, దుఃఖసాగరమున బడవైచుచున్న యీ అజ్ఞానముయొక్క అస్తిత్వమును తెలిసికొని వెంటనే మహాత్ములయొక్క, సంసర్గముద్వారా దానిని బయటకు గెంటివేయవలెను.

15. ప్రపంచములో రెండు వస్తువులున్నవి. ఒకటి శిరస్సు (Head), రెండు హృదయము(Heart) అని; ఇందులో మొదటిదానిని ఆశ్రయించుట అనగా, ప్రపంచములోని సమస్త లౌకికవిద్యలను, వాఙ్మయమును పరిగ్రహించుట యగును. రెండవదానిని ఆశ్రయించుట యనగా దైవగుణములు కలిగి భక్తిజ్ఞాన వైరాగ్యములను చేపట్టి, పవిత్రమైన శీలమును గలిగియుండుట యగును. ఈ రెండింటిలో మొదటి దానికంటె, రెండవది భగవంతుని దృష్టిలోమిన్న. శిరస్సును వికసింపచేసి, హృదయమును సంకుచిత మొనర్చినచో నేమి ప్రయోజనము? అన్ని విద్యలు నేర్చుకొనినప్పటికిని, ప్రేమ, దయ, పరోపకారము, మున్నగు దైవగుణములు లేనిచో, ఏమి లాభము? కావున ప్రపంచవిద్యలతోపాటు దైవగుణములను కూడ అలవరచుకొనుము.

# లేఖలు

## (అశాంతితో బాధపడుచున్న ఒకానొక వ్యక్తికి శ్రీవారు వ్రాసిన లేఖ)

ప్రియాత్మస్వరూపా!

మనస్సుపై నిగ్రహము (Control) కలిగియుండుటను నేర్చుకొనుము. మనస్సును అదుపులో నుంచుకొనుము. ఏ వస్తువైనను పెడదారి పట్టినప్పుడు దానిని నిగ్రహించక పోయినచో తుదకు అది ప్రమాదమునకు దారితీయగలదు. ఇంజను వేగము ఎక్కువైనపుడు డ్రైవరు దానిని తగ్గించి, స్పీడును 'కంట్రోలు' చేసి మితముగా నడుపును. సైకిలు పల్లములకు పోవునపుడు, దాని అధిష్ఠాత చల్లగా, బ్రేకు వేసి దానిని అదుపులో పెట్టుకొనును. ధరలు పెరిగిపోయినపుడు ప్రభుత్వమువారు వానికి 'కంట్రోలు' విధించి కట్టుదిట్టము చేయుదురు. వాగుడు అలవాటైనవారు నాలుకకు 'కంట్రోలు' పెట్టి కొంతసేపు మౌనము శీలించుదురు. అతిగా భోజనము చేయువారు మితాహారనియమము అభ్యసించునప్పుడు, తమ భోజనమును నెమ్మదిగా 'కంట్రోల్' చేసికొందురు. వేయేల! ప్రపంచములో ప్రతివస్తువు ఒక్కొక్క సమయమున నిగ్రహమునకు లోనయినప్పుడే బాగుగ పనిచేయుచుండును.

ఇట్లుండ జగత్తులో అన్నిటికంటె మేటియై, సమస్త ప్రపంచమునకు కారణభూతమై, సుఖదుఃఖము అన్నింటికి, మూలకారణమైనట్టి మనస్సు ఏదికలదో, దానినిమాత్రము నిగ్రహింపక దానిపై 'కంట్రోలు' విధింపక వదలివేసినచో తుదకు ఆ జీవునిగతి "దుష్టాశ్వా ఇవ సారథేః" అనునట్లు అధఃపతనమే అగును. ఎవడు తన మనస్సును జయించునో, అతడు సమస్త ప్రపంచమును జయించినట్లే! ఎవడు తన ఇంద్రియములను నిగ్రహించునో అతడు సంసారసముద్రమును దాటినట్లే, కావుననే గీతాచార్యులు___

తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥

అని నుడువుచు, ఇంద్రియ మనస్సులను మొట్టమొదట నిగ్రహించవలసిన నదిగా ప్రబోధించెను. ఈ భావమునే సమయము దొరికినప్పుడెల్ల పలుచోట్ల భగవంతుడు గీతయందు వ్యక్తీకరించెను.

పై శ్లోకములో 'ఆదౌ' అని ప్రయోగించుటవలన సాధకులగు ముముక్షువులు, తమ గమ్యస్థానమును పొందుటకై అవలంబింపదగిన ప్రప్రథమ సాధనము ఈ ఇంద్రియ, మనోనిగ్రహమే అని తేటతెల్లమగుచున్నది.

కాబట్టి ప్రతివారు భక్తివైరాగ్య నిష్కామ కర్మాదులను, సహాయముగా తీసికొని తమ ఇంద్రియములపై, మనస్సుపై నిగ్రహము (కంట్రోల్) కలిగి, అవి కామక్రోధాదులకు వశముగాకుండ నిరోధించి, వానిని దృశ్యవిషయములనుండి మరలించి, ఆత్మోన్ముఖముగా చేసికొనవలెను. ఇదియే సమస్త శాస్త్రములయొక్క సారాంశము. ఇదియే శ్రీకృష్ణపరమాత్మయొక్క దివ్యాశయము. ముముక్షువులు దీనిని ఆచరణలో నుంచి మోక్షశ్రేయస్సును పొందుదురుగాక !!!

ఓమ్,

స్వామి విద్యాప్రకాశానంద.

—: (o) :—

ఒకానొక భక్తునకు శ్రీవారు వ్రాసిన లేఖ—

ఆత్మస్వరూపా !

జీవితమొక రణరంగము. ముముక్షువులు మాయయను గొప్ప శత్రువులు ఎదుర్కొని పోరాడుచున్నారు. అనేక జన్మార్జిత ప్రాపంచిక వాసనలు, సాధకుని ఆధ్యాత్మిక భావములను మరుగుపరచుటకు, ప్రయత్నించుచున్నవి. ఇట్టి సమయమున భక్తులు, సాధకులు, ముముక్షువులు, తమ జన్మహక్కైన ఆత్మసామ్రాజ్యమునకై యీ యసుర శక్తి

అతో తీవ్రముగా పోరాడి విజయమును జేపట్టవలయును. ధైర్యమును వీడరాదు. నిర్భయత్వమును త్యజింపరాదు. సర్వేశ్వరునిపై అచంచల విశ్వాసము కల్గి శ్రీ సద్గురువులయెడల మిక్కుటమగు భక్తికల్గి అఖండిత ధైర్యసాహసములతో సాధన చేయవలెను. ప్రాపంచిక కార్యములను ఎంత శ్రద్ధతో ఆదరించెదరో, అంతకు పదిరెట్ల శ్రద్ధతో ఆధ్యాత్మిక కార్యముల నాచరించుచుండవలెను. జీవితకాలము అతిస్వల్పముగా నున్నది. ప్రతిబంధములు మెండుగానున్నవి. మృత్యుదేవత జీవులను కబళించివేయుటకై సిద్ధముగానున్నది. కాబట్టి ఆలసింపక తరించు మార్గమును వెదకవలయును. దీపమున్నపుడే యిల్లు చక్కబెట్టుకొనవలెను. త్వరలో సద్గురువు నాశ్రయించి, సంసారదుఃఖనివారణోపాయమును, అతనిద్వారా తెలిసికొని, ప్రయత్నపూర్వకముగా కడతేరుటకై యత్నింపవలయును. అమోఘమైన మనుష్యజన్మ లభించియు తాను తరించుటకై మార్గమును వెదకనివాడు మృగజీవితమును గడుపువాడే యగును. కాబట్టి త్వరపడుడు! అజ్ఞానపిశాచమును పారద్రోలుటకై కటిబద్ధులు కండు! ఈ జీవితమునందే చరమలక్ష్యమగు ఆత్మసాక్షాత్కారము బడయులాగున భీష్మప్రతిజ్ఞను సల్పుడు! నిర్మలభక్తి, తీవ్రమగు ముముక్షుత్వము, అఖండితదీక్ష, పవిత్రమగు అనుష్ఠానము కల్గి, యున్నచో విజయము కరతలామలకము. దైవమతము అచిరకాలములో లోకములో సర్వత్ర ప్రతిష్ఠింపబడును గాక.

ఇట్లు,

(Sd.) స్వామి విద్యాప్రకాశానంద.

ఓం తత్ సత్!!

[శ్రీ వ్యాసాశ్రమమున తపస్సు గావించుకొనునపుడు శ్రీ స్వాములవారు తమ జనకునకు (ఆంగ్లభాషయందు) వ్రాసిన ఒకానొక లేఖ—]



Sri Vyasa Ashram,
Yerpedu,
28—1—1942.

Dear Father,



Received your letter. My health is in a sound condition at present. The ideal of man is always to 'look up and aim high.' Progress alone is the sign of humanity, not weekness. Deterioration is the mark of animality. As man progresses day by day, his opinions also change, ideas differ and a complete metamorphosis is soon brought about in his character. He will become a new man altogether. Nay, a gulf will be created between his previous mode of walking and his new state of life.



It is nearly six years since I have stepped into this Ashram leaving you all, leaving house, family and friends nd from that time, by the grace of the Almighty and by the blessings of Gurudev Sri Malayalaswamiji Maharaj I found myself on the progressive line. Year after year as my mind is having more and more an internal bent and getting disinterested in external things, I proceeded to cut short my connections with others - with outsiders, friends, well-wishers and even with Ashramites. For, a time must come, when man is to be left entirely for himself, alone, without even a single 'Bahirmukha-Sankalpa,' to dive deep into the inner recesses of his heart and drink the necter of immortality, a divine store ready for use in every individual. A complete change from 'Pravritti' to 'Nivritti' must take place at one time or other in man making progress in the spiritual relam. Otherwise first-grade Sadhana is almost impossible.

A whole-timed aspirant can never divide his time between God and the world. The idea of recluse and complete retirement grew stronger and stronger in me day by day and it became strongest a month back. My mind rebelled as it were to do external work and sa I could not remain without narrating to Swamiji regarding my disinterest in the performanee of work. Owing to a keen desire for higher meditation I approached him on the 30th of December (1942) and clearly explained to him the whole thing in emphatical terms. He accepted most gladly.

Thus the way is opened unto me. Although the kind Lord has been helpful to me these six years in presenting before me conductive circumstances; thus help of His in giving me full liberty for meditation, I deem it hight in as much as it created a wonderful atmosphere for me to strain every nerve in realising truth. My joy knew no bounds as the word of consent came out from the lips of Swamiji and I could not but remain extrolling the illimitable mercy of the Lord towards His devotees.

I took the vow of taciturhity (Mowna) on the 1st of January, but I cannot give out at present how long I will continue it. The wind is most favourable to me now and I must not lose the opportunity presented before me but spend my time in realising the ideal soon. I should not bring in 'Vikshepa' to my mind at present by attending conferences, delevering lectures and touring from one place to another. This is not the time for me for all those external things. I must proceed internally for some time right earnestly now! I must strike the iron only when it is hot.

Om tat sat.

Yours in the Lord.
(Sd.) ANANDA MOHAN,
(Swami Vidyaprakashananda
in his Poorva Ashram.)

శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారికి

ప్రథమ గీతాయజ్ఞసందర్భమున సమర్పించిన

# పద్యకుసుమమాలిక

రచన : వారణాసి వెంకటేశ్వర్లు

ఓ శ్రీ శుక బ్రహ్మాశ్రమ విశ్రుత విద్యాప్రకాశ విపులానందా
మీ శ్రీ చరణాబ్జములకు మా శ్రద్ధాంజలులివె గొనుమా గిరిస్వామీ!
ఓంకారోచ్చారణతో శంకర శ్రీరామకృష్ణ సంస్మరణముతో
సంకల్పశుద్ధితో మోక్షంకరగీతాప్రబోధ గావింతురకో
వేదశాస్త్రపురాణాది వివిధగ్రంథ సింధువులు మథించి మివుల శ్రేష్ఠమైన
శ్లోకరత్నాలరాసులవేర్చి బోధమీర మానసముల వెలిగించితివో మహాత్మా!
అట్టి మధురాతిమధుర శ్లోకాళివలన అమృతధారాప్రవాహ మాయెన్నలీల
కన్నులవిరిసినట్టుల వివిధ ప్రజలు తన్మయానంద మొందగిరి ధన్యయోగి!
ఏయుపమానమానుడివిన నాయది యాధ్యాత్మతత్త్వమలరించు చెదో
తీయగ హాయిగ స్థాయిగ మారొడఁబడఁజేరి ముక్తిమార్గంబరయ్యెన్!
రెండుగంటల కాలమ్ము రెండుక్షణములట్లు గడచిపోవుసుగా మహాత్మా మీదు

సరళగీతాప్రబోధామృతరసపాన వాంఛ సభ్యులహృదయాలఁ బ్రబలి యుండె!

సకలజనజాడ్యతిమిరమ్ము సమసిపోయ అబ్జబంధునిరాక మీరాగమమ్ము.
అతులితానంద మోక్షమునంద జేయు మీదు గీతాప్రబోధమ్ము మేలుకొల్పు
అమృతధారగా గీతారహస్యములను ఉపనిషత్తులతాత్త్వికయోగములను
పదియు నెనిమిదిదినము లుపన్యసించితీర నర్సరావుపురభాగ్యంబదేమొ!

నర్సారావుపేట,
20-12-57.

ఇట్లు
నర్సారావుపేట పౌరులు.